## పా త్ర ధా రు లు :

# శో భ న్ బా బు

## ఇద్దరు అందాల రాణులు

| | | |
|---|---|---|
| సత్యనారాయణ | .... | మోహన్‌బాబు |
| రాజబాబు | .... | సాక్షి రంగారావు |
| ముక్కామల | .... | సి. హెచ్. కృష్ణమూర్తి |
| బొట్టిప్రసాద్ | .... | కె. కె. శర్మ |
| భీమరాజు | .... | సీతారాం |
| బాలకృష్ణ | .... | చిట్టిబాబు |
| జయప్రకాశ్ రెడ్డి | .... | చంద్రరాజు |
| సుహాసు | .... | దేవానంద్ |
| ప్రభాకర్ | .... | కె. కోటేశ్వరరావు |
| నిర్మల | .... | విజయలక్ష్మి |
| జయమాలిని | .... | మమత |
| హలం | .... | పద్మాంజలి |
| జయవాణి | .... | డా॥ వసుమతి |
| రమోలా | .... | శ్యామల |
| సావిత్రి | .... | లక్ష్మీదేవి |

బేబీ రాణి, బేబీ రోహిణి, బేబీ వరలక్ష్మి తదితరులు

శ్రీ గాయత్రి ప్రెస్, విజయవాడ-11

# నాయుడుబావను గురించి నాలుగు మాటలు

నాయుడుబావ చిత్రం. ప్రయోగాత్మక మూకాదు.
ప్రయోజనాత్మక మూకాదు.

కేవలం....వినోదం__ప్రధానంగా రూపొందించిన చిత్రం.

అంతేకాదు.............

కథానాయకుడు కమెడియన్‌గా నటించిన చిత్రం కూడా.

ఇంకా చెప్పాలంటే.........

కుర్రకారు గుండెల్లోనా
నవ కువలను చేసే చిత్రం.

అరవిరిసిన అందాలెన్నో
అరబోసిన రంగుల పత్రం.

మొగ్గలు తొడగని శృంగారంతో
ముగ్గులు తీర్చిన కళామంటపం.

మూగ మనసుల ముద్దులాటలో
దాగుడు మూతల క్రీడాభిరామం.

సరిగమలూ... పదనిసలూ
సరసం నేరిపే మందర స్వప్నం

నవరసాలతో వంటి వార్చిన
పలిచెప్పని విందు భోజనం.

ఇలా చెప్పాలంటే............

ఎన్నైనా చెప్పొచ్చు
కాని....తినబోయే ముందు రుచి చెప్పడం మంచిదా....?

అంచేత....ఆరగించడం, ఆనందించడం
రెండూ మీకే వదిలేస్తున్నాం.

# పాటలు



పాట - 1

రచన:
మల్లెమాల

పాడినవారు:
సుశీల

టీ టిక్కుం టీటీ టిక్కుం నాయుడుబావా !...నేను
కీ అంటె ఎదుట నిలచి కీ కొడతావా !......చేత
తోకముడిచి మేకలా పరిగెడతావా !.........
మె మ్మె మ్మె మ్మే......బె బ్బె బ్బె బ్బే
మె మ్మె మ్మె...బె బ్బె బ్బె......నాయుడు బావా !..........॥టీ॥

చీరాకైతా సింగారిస్తే...సినిమా తారలా వుంటావు
బొట్టూ కాటుక పెట్టామంటే....బోగం పిల్లైపోతావు
గాజులు తొడిగితే......రాజకుమారి
పసుపు రాసితే.........కుసుమకోమలి ॥టీ॥

పల్లెటూరి బైతుకాదే...పనికొస్తాడే ఇతగాడు
తోకే వుంటే హనుమంతుడికి తూ. దా. తప్పని ఇతగాడు
రెక్కలు వుంటే...గరుత్మంతుడు
చక్కదనంలో......జాంబవంతుడు ॥టీ॥

పాట - 2



రచన:

**మల్లెమాల**

పాడినవారు:

**బాలసుబ్రమణ్యం, సుశీల**

నెల్లూరి చేలలో పిల్లగాలికి ఊగే
వరి వెన్ను లాంటిది మల్లిసొగసు...అది
వద్దన్నా దోస్తుంది నామనసు ॥—
ఏలూరితోటలో ఏపుగా పెరిగిన
చెరుకు గడ లాంటిది నావసొగసు...దాన్ని
కొరికి చూడ మంటుంది నావయసు॥—
నీ నవ్వే హరివిల్లు
నీ కళ్ళే వడగళ్ళు
నీ నడకలు అడవినెమళ్ళు
పరువానికి ఆనవాళ్ళు...నువు
పలికేటి ప్రతిమాట పన్నీటి జల్లు॥— ॥నెల్లూరి॥
పరుగులు తీసే నది వుంది
పక్కన చక్కని పొదవుంది...
నీ...మదిలోనే ఒదిగొదిగి
నిదరోయే ఆ ఇదివుంటే...ఆ
పొదతోను నదితోను పనియేముంది! ॥ఏలూరి॥
నీ చెయిలో చెయ్యేసి
నీ ఒళ్ళో తలవేసి
నీ బుగ్గపై ముద్దేసి
నీ సిగ్గులనే కాజేసి
నీ...నీడల్లే ఉంటాను నీతోనె కలిసి॥
నీ తోనె...కలిసి॥——



పాట – 3

రచన:
మల్లెమాల

పాడినవారు :
బాలసుబ్రహ్మణ్యం

ఢీ ఢిక్కుం ఢీఢీ ఢిక్కుం దస్తీబొమ్మా !...నేను
ఢీ కొడితే నీ దిమ్మ తిరిగే నమ్మా !......అ
దెబ్బతో తలదిమ్మ వదిలేనమ్మా !......
మెమ్మెమ్మెమ్మే...దెబ్బెబ్బెబ్బే
మెమెమ్మె...దెబ్బెబ్బె...దస్తీబొమ్మా ! ||ఢీ||

బుర్రాబుడ్డీ నీకే వుందని విర్రవీగావారోయ్
బిక్కంలోని పిట్టలాగ...చేతికి చిక్కావేరోయ్
చెవులు మెలేస్తే...ఏం చేస్తావు !
బుగ్గ గిల్లితే...ఏమౌతావు ! ||ఢీ||

పల్లెటూళ్ళో గాలికితూగా... వరుసే ముఖ్యం తెలుసుకో !
కలలోనైనా ఎదటివాళ్ళను గౌరవించడం నేర్చుకో !
చేసిన తప్పుకు...చెంపలు వేసుకో !
తీరా తెమ్మా......తెలిసి నడుచుకో ! ||ఢీ||

పాట – 4

రచన:

మల్లెమాల

పాడినవారు:

ఎల్. ఆర్. ఈశ్వరి



ఎ బి సి డి...ఎక్స్
లైఫ్ ఈజ్ ఫుల్ ఆఫ్ సెక్స్
ఎంజాయ్...ఎంజాయ్...ఎంజాయ్...

మై నేమ్ ఈజ్ బ్యాట్
ఎవ్రైథింగ్ ఈజ్ మై మ్యాటర్
హెవెన్ ఈజ్ ఆన్ మై లిప్స్
హ్యావ్ ఇట్ విత్ యువర్ లిప్స్
ఎంజాయ్...ఎంజాయ్...ఎంజాయ్...

కాల్ మి ఆన్ సన్డే
ఆయామ్ ఫ్రీ ఆన్ దట్ డే
మెనీ కిస్సెస్ ఐ విల్ పే
బీ హ్యాపీ నైట్ అండ్ డే
ఎంజాయ్...ఎంజాయ్...ఎంజాయ్...

## పాట – 5



రచన :
మల్లెమాల

పాడినవారు :
బాలసుబ్రహ్మణ్యం

హరిహరీ నారాయణా ! ఆది నారాయణా !
ఆడదా ఇది...కాదు. అంబుజోదరుడా ?
...హేయ్...
గంగమ్మ పుట్టినా గడ్డలో పుట్టావు
తల్లినీ గోదారి చనుపాలు తాగావు
సిగ్గన్నదే నీకు లేదా ? నువ్వు స్త్రీ జాతికే మచ్చకాదా ? ॥గం॥
తెంగావికోక కట్టి....చేమంతులా కొప్పున జుట్టి
బొండుమల్లె పువ్వల్లె గుండ్రంగ బొట్టుబెట్టి
ఎదురైన ప్రతివాణ్ణి....ఇట్టే వికేసేటి
మా ఊరి పుల్లమ్మ ముందు నువ్వెంతమ్మా.... ॥గం॥
సిగతరగ ఈ ఆట సీమనుండొచ్చింది
ఏరోజు కారోజు ఎర్రి తలలేసింది
మనిషి మనిషిని కట్టి మైకంలో ముంచింది
జాగ్రత్త పడకుంటె జాతినే మింగేస్తుంది....
ఏయ్‌రా నాసామిరంగా....చిందెయ్‌రా కావేటిరంగా
జానపదం గొప్పదని....దానికదే సాటి అని
ఎలుగెత్తి జైకొట్టి.... ఎదాపెరా కొరడట్టి
ఏయ్‌రా నా సామిరంగా....చిందెయ్‌రా కావేటిరంగా
ఏయ్‌రా...ఆహా...ఏయ్‌రా...ఏయ్‌రా...ఆహా...ఏయ్‌రా
ఏయ్...ఏయ్...ఏయ్...ఏయ్...ఏయ్...ఏయ్...

పాట – 8



రచన :
మల్లెమాల

పాడినవారు :
బాలసుబ్రహ్మణ్యం

నా పేరే హంటర్
నా మాటే సవాల్
ఆలిగొస్తే...బెబ్బులికైనా
అలికిడి వింటే...హంటర్...హంటర్...నా
అలికిడి వింటే హంటర్...హంటర్......... ॥నా॥

"మానవుడూ...దానవుడూ"
రెండూ నేనై మసలినవాణ్ణి
ఎదిరిస్తే......ఏదైనా
మదమణిచే "మొనగాణ్ణి"
వీరత్వంలో "అభిమన్యుణ్ణి"
విజయం పొందిన "జోగ్గాణ్ణి"
అంతా మెచ్చిన "కోడెనాగు"ను
అంతే చిక్కని "జేబు దొంగ"ను......... ॥నా॥

పగతోనే .....పుట్టాను
పగ మూలం పసికట్టాను
పగ నా ఊపిరి...పగ నా మనసిరి
పగ సాధించక వదలను హ త్తిరి......... ॥నా॥



## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| చిత్రానువాదం. | } | మల్లెమాల |
| మాటలు. పాటలు | | |
| కథ | : | రాజశ్రీ |
| సంగీతం | : | సత్యం |
| నేపథ్యగానం | : | సుశీల, బాలసుబ్రహ్మణ్యం. L.R. ఈశ్వరి |
| ఛాయాగ్రహణం | : | పి. యస్. ప్రకాశ్ |
| కళ | : | భాస్కరరాజు |
| కూర్పు | : | కె. ఎ. మార్తాండ్ |
| నృత్యములు | : | చిన్ని-సంపత్: వి. సీతారాం:<br>ఉడిపి జయరాం |
| దుస్తులు | : | కృష్ణ, బాబూరావు |
| అలంకరణ | : | టి. యస్. నారాయణ, అప్పారావు,<br>జయకృష్ణ, సుబ్బయ్య, సాంబయ్య, సింగ్ |
| సెట్స్ | : | శ్యామలరావు |
| పబ్లిసిటీ | : | గంగాధర్ |
| ప్రెస్ పబ్లిసిటీ | : | విజయా పబ్లిసిటీస్, (విజయవాడ) |
| శబ్దగ్రహణం | : | యస్. పి. రామనాథన్, శాంతం, మురళి |
| నిర్వాహకులు | : | జి. కృష్ణమూర్తి, బి. టి. నాయుడు,<br>టి. రమణారెడ్డి |
| సహాదర్శకుడు | : | వై. ఈశ్వరరెడ్డి బి.ఎ. |
| సహాకారదర్శకులు | : | జయంపుకృష్ణ, కె. అశ్వ |
| సహాయదర్శకుడు | : | పి. సత్యనారాయణరెడ్డి |

## పంపిణీదారులు

| | | |
|---|---|---|
| ఆంధ్రా | : | విజయా పిక్చర్స్ |
| నైజాం | : | శ్రీ నేషనల్ ఆర్ట్ పిక్చర్స్ |
| సీడెడ్ | : | శ్రీ రమణామూవీస్ |
| మైసూరు | : | నవజ్యోతి ఫిలిమ్స్ |
| ఒరిస్సా | : | శ్రీమహాలక్ష్మి ఫిలిం డిస్ట్రిబ్యూటర్స్ |

